# జా తీ య గ్ర ం థ ము లు



## —। జాతీయ నాటకములు ।—

| | |
|---|---|
| క్విట్ ఇండియా విప్లవం | 1-4-0 |
| స్వతంత్రజ్యోతి (అను) జాతి విముక్తి | 1-4-0 |
| గాంధీ విజయధ్వజము | 1-0-0 |
| తిలక్ మహారాజు | 1-0-0 |
| గాంధేయ విజయధ్వజము | 1-0-0 |
| అపనింద | 1-2-0 |

## —। జాతీయ గ్రంథములు ।—

| | |
|---|---|
| గాంధీ రాజ్యాంగము | 1-8-0 |
| రైతులు, కమ్యూనిష్టు, కాంగ్రెసు | 1-8-0 |
| ఎన్నికలు, కమ్యూనిష్టులు, కాంగ్రెసు | 1-8-0 |
| పాకిస్థాన్ | 0-8-0 |
| నేతాజీ అంతర్ధానగాథ | 1-8-0 |
| డాక్టరు కోట్నీసు | 1-0-0 |
| ప్రపంచ పరిణామము | 1-8-0 |

# నాయకులు

రచయిత:

## వేదాంతకవి

పబ్లిషర్సు:

## కురికూరి సుబ్బారావు అండ్ సన్స్

**1946**

ఖరీదు
తక్కువ

తరిఫీదు
ఎక్కువ

# మహాకవి పరమేశ్వరుడు



సుందర సుకుమార మాధుర్యం ప్రళయమేఘ గర్జన గాంభీ ర్యంగల కవితా పరమేశ్వరుడి స్వతంత్ర స్వేచ్ఛా శివతాండవంవల్ల ఉన్నతహిమవత్పర్వత శిఖరాగ్రములనుంచి అనేక అమృతజాహ్నవీ ప్రవాహాలు పొంగిపొర్లి పరుగులుపెడతై. విశాల విద్యారణ్య ప్రదేశాల్లోంచి బ్రహ్మానంద సముద్రంలో పడతై.

అనంత భావాంబర విహంగ వీరవిహారంచేస్తున్న నిరంకుశ కవితా పరమేశ్వరుడు సౌందర్యోపాసకుడై, ప్రతిఫలవాంఛారహి తుడై వాఙ్మయ సింహాసనం అధిష్ఠించి విశ్వశ్రేయస్సుకోసం సమస్త మానవ హృదయాల్లో ధర్మశాసనాలు చిత్రించి బ్రహ్మా నంద డోలికలూపి జోగొడతాడు కష్టాల్ని పోగొడతాడు.

మానవ జీవిత ప్రబంధ లోకంలో మధుర సౌందర్యకళా స్రవంతిని ప్రవహింపజేసి, విశ్వానందనోద్యాన వాటికలకి విశాల వినిర్మల విశ్వభారతి మలయ మారుతాల్ని కదలించి మంజుల కమనీయ భావవిపంచికా నినాదాల్ని కదంత్రొక్కించి ఇట్లా మండుకుపోతున్న లోకాన్ని అఖండవాక్సుధా రసధారల్తో చల్లార్చి, సమస్తమానవ లోకకళ్యాణ సీమకెక్కిస్తున్న మహాకవి పరమే శ్వరుడు యుగయుగ వీధిలో పెద్ద గాలిదుమారం లేపుతాడు.

అధర్మయుగంలో లేచిన అవినీతులకి మహాకవి పరమేశ్వ రుడి హృదయం మందువేసంగియై మురిగిపోయిన పూర్వనదీ నదాల్ని యెండించి, ఘోరకాంతార నివాసాల్ని మండించి గంభీర వినూత్న విప్లవ భావమేఘ గర్జనలు దశదిశలకీ వినిపించి విశ్వ జనామోదకరమైన అమృత ధారాధర కుంభవృష్టిని కురిపించి బోసిపోయినమోడుల్ని, మాడిపోయిన బీడుల్ని కోమలంగా చివు రింపచేస్తాడు. అశేష విశ్వమానవకోటిలో ఆనందలక్ష్మీ విజయవీర విహారం చూపిస్తాడు.

నిర్జల ప్రదేశమైన మరు సీమలలో అమృతరస ప్రవా హాల్ని పరుగులుపెట్టించి చౌడుబారిపోయిన ఊషరక్షేత్రాల్ని సస్య శ్యామలం భరితంచేసి పాపిష్టి క్షామరాక్షసిని భయంకర వీతిహోత్రు నికి బలిచేసే మహాకవి పరమేశ్వరుడు విశ్వమానవ సంఘంలో అవతరించినప్పుడే విశ్వంభర రత్నగర్భయై విశ్వకుటుంబాన్ని పోషించుకొంటుంది.



# కస్తూరి మాత

ఆ చెఱలో జగజ్జననియై మన
కస్తురిమాత యెంతయో
నోచిననోము పంటకు, వినుండు
మహాత్ముని చేతికింక, నేఁ
డీ చతురబ్ధివేష్టిత మహీతల చక్రము
రాట్నచక్రమై
లేచెను; దేశదేశ మవలీలగ ద్రిప్పెను
నూలుపోగుతోన్.

# నేతాజి సుభాస్ చంద్రబోసు



లెస్సగ సీమవేళ్ల కుదళించెడి సత్తజవించు
పట్టుచే
బుస్సులుకొట్టు గిత్తయిడ పొంగులువెట్టెడి
వీరరక్తస్రో
తస్సులకెల్ల దిక్కయిన తర్జనభర్జన
గర్జనాభ్రమై
బిస్సనకుండుకై వడి, సెబాసు సుభాసని
పించ వచ్చెరా.

ఏగండు కోయిలరాగ సుధాఝరి
తియ్యని యీ చక్కనయ్య గనెనో
ఏలతాంతానందడోలికా శ్రుతిమాత
పేరిమి నీబిడ్డ, బెంచుకొనెనో
ఏ స్వతంత్ర విచక్షణా స్వరూపిణి వాక్కు
తరచుటీ తంత్రికి గలుపుకొనెనో
ఏ రాజ్యరమణీ విహార విశారద
లెల్ల యీ నేతాజి చల్లని మృదు
వాక్కులను ముద్దుపెట్టుకో పరుగులెత్తె
నో; మఱే భీకరారణ్యభూమి క్రూర
మృగ నిరంకుశ మత్తేభ బృందములకు
ఈ సుభాసంకుశంబయి దూసుకొనెనో.

ఇక బెంగాలట పోతుసింగములకై యెంచన్;
మహా జాతి కో
టొకటీతండటు గట్టినాఁడట; ఘనుండొక్కండు
లేఁడేమొ వీ
నికి సీడున్ మన గడ్డపై, గనుకనే; నేఁడాంధ్ర
పుత్రుండు వె
త్తికి వచ్చెన్గదె; బోసుబాబువలె ఖ్యాతిన్ దెచ్చు
వాఁ డెవ్వఁడో

బెంగాలుసింగమై బ్రిటను గుండియలోన
దూసుకొనెడి బాకు బోసుగాదె
బానిసత్వ పరత్వ బంధనమ్ములనెల్ల
కోసివేసెడి దిట్ట బోసుగాదె
బ్రహ్మచర్యముబూని బ్రహ్మాండమునునెత్తు
మొనగాఁడు మనకింక బోసుగాదె
భవితవ్యమున మన భారతావనికెల్ల
వాసివన్నెలుదెచ్చు బోసుగాదె
భరతమాత నోములపంట పండఁజేయు
ముద్దు నగుమోములయ్య యీ బోసుగాదె
రాజకీయ బాధితులకుఁ బ్రాణమిచ్చు
బాసగలవాఁడు నేఁటికీ బోసుగాదె.

# పండిట్ జవహర్లాల్ నెహ్రూ
## ప్రపంచపంజా



వసుధ ఈ జగత్సంస్థానపతికిగూడ
నీ యలికిడి తగిలిన గుండె పగులింక
నీకు దారియివ్వనివాఁడు నేఁడు కలఁడె?
జవహరునిపేరు తగు నీకె శౌర్యధనుఁడ.

ఉడుకులు పట్టుచుండెడి మహోజ్వల భావ
సముద్రమూర్తివై
పుడమి కుదించి రత్నములు ముద్దులనోటను
పుక్కిలించి; వ
చ్చెడి యుగభాగ్యసుందరి రచించెడి ముత్తెపు
ముగ్గుమీద ముం
దడుగును వేయు నాయకుడవై తివి
నెహ్రూకుమార ధీమణీ.

ప్రియముగ నవ్వునవ్వి కనుతెప్పలు వాల్చి
మతెంత కాలమో
అయినది; నీ ప్రసన్న వదనాబ్జము కోసము
దేశదేశముల్
పయనముఁగట్టె; తావక సభాభువనైక సుధా
కధా మహో
దయమున దారిఁజూపుము సుతారముగానిక
నెహ్రూధీనిధీ.

ఈ ప్రపంచ ప్రజాసౌఖ్యమెల్ల దోచి
మతమహిమల చాటున నక్కి బ్రతుకు ప్రభులు
తారుమారయిపోవ కాశ్మీరు జొచ్చి
సింహగర్జనచేసి వచ్చితివ తండ్రి.

నిజముగ నెహ్రూవీర! తెగనిర్మోగమాటముగా
చరించి భూ
ప్రజకు మతుల్ శ్రుతుల్ కలిపి పట్టము కట్టెడి
వాడవీవు; నీ
ప్రజకిఁక చీలిపోని భగవన్మతరాజ్య
పతాకమిచ్చి; అ
క్కజముగ దిక్కుదిక్కునకు కాంగ్రెసెదిక్కని
చాటఁ జేయుమీ.

మొదట మహమ్మదీయులు ప్రభుత్వము చేసిన
దానికేగదా
ముదముగ హక్కునిక్కడ సముల్ పరికించిరి;
దానిమాదిరే

అదుపుగ సీమవారికిని హక్కునొసంగిన
దిక్కులన్ని అ
భ్యుదయముతో స్వతంత్రమును పూయవె
నెహ్రూకుమార ధీమణీ.

ధరణీమండలమెల్ల చల్లబడగా దైవంబె
నేఁడీ ప్రజా
పరిషత్తుగా నిలపెట్టి యిచ్చట ప్రజావర్గాల
కద్దానిలో
పరిపాలించెడి హక్కునిచ్చె; నిపుడీ పాశ్చాత్య
దేశీయులం
దఱికిన్ గూడ సమానహక్కిడిన మైనార్టీల
గోలెత్తనీ
యరు వారింకను; లేక పోయిన ప్రభూ! అల్లర్లు
కానివ్వరా?

చక్కగ "లైబ్రరీలో" పలుజాతుల గ్రంథము
లుంచి, యెన్నియో
దిక్కుల కెక్కుచున్ తెలివితేటలు గాంచెడి
రీతిగా, ఒకే
లెక్కకు జాతులన్ని తగిలించి ప్రజాపరిషత్తు
నిల్పి; నే
డిక్కడ చిక్కులన్ని సడలింపుము నెహ్రూ
కుమార ధీమణీ.

హాయిగ అచ్చివచ్చిన దటంచు పురాతనకొంప
విప్పఁబో
నీయని లోభివోలె గమనించక కాలము
పెద్దలెందఱో
యీ యిరుకైన యింట వసియించి మరామతు
మాటగూడ రా
నీయుటలేదె నెహ్రూ ! యిలు నీ విఁక మార్చుము
నీహయాములో.

లెస్సగ నేఁడు కాంగ్రెసుకు లీగుకు సీమకు
వచ్చియున్న తే
జస్సునుబట్టి. ముగ్గురు ప్రజాపరిషత్తు
ప్రధానులైనచో
బుస్సులు కొట్టుకోవటముపోయి ప్రభుత్వ
పటుత్వమెల్ల ఆ
శీస్సులు పొంది భూప్రజకు చిక్కులు తీయదె?
నెహ్రూ ధీనిధీ,

# జయప్రకాష్‌నారాయణ్



నిన్ను చూచి నవ్వి ప్రతిజ్ఞ లిన్నిచేసి
ఉత్తరకుమారులయి మొత్తమున్నవారు
రధము దూకి పర్గెత్తిన విధము కాస్త
విన్నవించుము భారత వీరపుత్ర.

ఈ యగచాట్లలో బడిన యింత
పవిత్ర ధరాలలామకై
తోయధు లన్నిలేపి, కసితో పసితో
చురుకైన చూపుతో
వీ యరికోటి గుండియలు నిల్వున చీల్చి
జయప్రకాశ నా
రాయణ తెచ్చినావుర స్వరాజ్య రథంబును
కచ్చితమ్ముగాన్.

# బూ లా భా య్ దే శా య్

ఇంత ఎగిరి పడెడి భాయి లెందఱున్న
దేశమునకు ప్రాణముపోసి దిక్కు జూపి
పోయినట్టి బూలాభాయి ముందు నేఁడు
నిలువలేఁడొక్కఁడు చెలామణియును గాఁడు.

ఏ యదుపాజ్ఞ లేక, కనులేమియు
గానక నాల్గు వంద లేం
డ్లీ యవనీతలమ్ము కడు హీనముగా
పడద్రొక్కినట్టి ఆం
గ్లేయుల పిక్కబల్మి సడలించి స్వరాజ్య
పతాక మీ బులా
భాయి భుజమ్ము లేపినది భారత మాత
ఋణమ్ము తీరగాన్.

ఇన్నాళ్లీ రవి యస్తమించని మహీ హేలా
　　ప్రభుత్వంబుతో
ఎన్నాళ్ళోపడి కొట్టు కొన్న "అమెరీ"యీరాజ
　　లోకంబులో
కన్నీళ్ళోడ్చిన కాళ్లు పట్టిన వృధాగా మ్రొక్క
　　లై పోయె; మేల్
కన్నా కై తన దేశనై నికుల భూలాభాయి
　　కాపాడెరా.

నలభై కోట్ల కుమార రత్నములతో నా నా చెఱల్
　　వద్ద యీ
తులసీ రాజ్యరమాలలామకు విపత్తుల్ తీర్చి
　　యోదార్చి భూ
లలనారత్నము చేసినట్టి మన భూలా
　　భాయి వీరాగ్రణిన్
చులకంగా పులియేది మ్రింగినదొ యీ
　　శోకాగ్ని చల్లారునా.

తన మేథస్సు మహాతపస్సు వడ పోతన్ బోసి
యీ దిక్కు_మా
లిన దేశానికి ప్రాణ భిక్షయిడి తల్లీ! మా
స్వతంత్ర ప్రజా
ఘన సింహాసన రత్న మందిర కళా
కావ్యేందిరా దివ్య పా
లన మిప్పించి దివంగతుండయిన భూలా
భాయి కన్పించునా?.

మూడుమూర్తులు పొంగి పొర్లి ప్రవాహమై
కంచుకోట పహారాకాయునాఁడు
వీరరసము కృష్ణవేణీ తరంగమై
విజయుడులేచి కవ్వించునాఁడు
రంగవల్లిక వేసి తుంగభద్రానది
జయహారతులు తెచ్చి చదువునాఁడు
రోజాలతో పోతరాజును గైకొని
నైజామ కలసి వెంటాడునాఁడు

త్యాగరాజు విపంచి మార్మ్రోగునాఁడు
సుందరశరీర సుకుమార సురుచిరమయి
గ్రాలు మన తెన్గుతల్లి ప్రకాశమునకు
ప్రభతఋగ దాంధ్రకేసరి బ్రతికియుండ.

పులులకు కొమ్ము పేన్గులకు మొన్నటిదాఁక
మహాభయంబు నీ
అలికిడితో జనించిన వనావళిలోపల
నేఁడు నీవు వి
చ్చలవిడిగా చరించక; నిజమ్ముగ సర్కసు
పంటిదైన యీ
కొలువులో యేమి యుట్టిపడి కూర్చుని
యుంటివి ఆంధ్రకేసరీ.

క్రాగించే ధనగర్వకౌశలముచే, "కంపార్టు
మెంటంత" ఖా
ళీగానుండినచోటనెక్కి తనకూలీలిచ్చు
సామానుతో
జాగానంతయు నాక్రమించుకొని, దర్జాగా
పరుండింక; రెం
డో గోలే విననట్టి యీమతపు తంద్రుల్
లేచు పెట్లో ప్రభూ.

ప్రతి మతకర్త పెట్టిన పురాతన పట్టణ
పూటకూళ్లలో
హితముగ తిన్నవార లిపు డెంగిలిమూతుల
తోడవచ్చి మా
మతపు పదార్థమే రుచిసుమా యని లేచిరి
కచ్చెకౌర! భూ
పతివయి యీ ప్రపంచ భగవన్మత మిమ్ము
స్వయంప్రకాశమా.

తనపయి భక్తిలేక తలదన్నినవాని
శపించలేక మ్రొ
క్కిన నిజభక్తునిన్ గసరి గెంటెడి గంగమ
వోలె; నేఁడు చూ
చిన దొరనెల్ల పొమ్మని కసిన్ దెగతిట్టిన
లాభమేమి? గె
ల్చిన మొనగాడ! కాంగ్రెసుకు లీగుకు సీమకు
చెల్మిసేయుమీ.

కష్టకాలమ్ము గడపు చర్ఖానుబట్టి
స్వీకరించిన కాంగ్రెస్ పతాక మనెడి
గొప్ప గోవర్ధనగిరి నీ గోపుడెత్తి
పిలుచుచున్నాడు లెమ్మోయి తెలుగుబిడ్డ.

కంటబడకుండ కానలో గష్టపడిన
పంచపాండవు లెవని స్మరించినారొ
అట్టి పంచముల్ గూడ మహాత్మునింక
ఆశ్రయించి కృతార్థులైనారు నేడు.

పచ్చనికొంప పాడువడి పస్తులతో బడిపోయి
వీధిలో
వెచ్చని బాష్పవృష్టి గురిపించిన భారతమాత
మూర్ఛచే
పచ్చల పిడ్గులెన్నోపడి చిట్లిన గడ్డకు
ప్రాణి పోయగా
వచ్చె మహాత్మగాంధి; పరిపంథి రథంబులు
దారి బట్టగాన్.

మలమలమాడు పొట్టకయి మానమునిల్పెడి
నూలు బట్టకై
కల ఎజమాని బండి కలకాలము లాగెడి
బక్క యెద్దువై
నెల కొకమాటు తేఁబడెడి నీ దినభత్యము
మ్రింగు కల్లు ముం
తల పడగొట్టు గాంధి చరణమ్ములు
పట్టుము పేద బిడ్డడా.

ఎవరేమాదిరి దూసి పోసినను గర్హింపండ
మాంతంబుగా
అవియెన్నో యొడిపట్టి దాచుకొను, ఏ ఆందోళనల్
లేచి యీ
భువనాలేడ్చిన ఖర్చుపెట్టఁడవురా ముత్యమ్ము
నేఁ డొక్కడై
న విచిత్రంబుగ; ఈ మహాత్మునికి మించన్ లోభి
యెవ్వాడురా?.

# అబుల్ కలాం అజాద్



కార్య భారము పైఁగల కాలమెల్ల
శౌర్య గుణధుర్యుడై యనివార్య బలిమి
హూణులను దీనులనుజేసి యుర్వినెల్ల
కాంగ్రెసుకు ధారఁబోసెఁ జక్కఁగ అజాదు.

పెద్ద తనమ్ము నందు తన పెత్తనమింక
కుమార్ల చేతిలో
ముద్దుగఁబెట్టి, కష్టసుఖముల్ మఱపించెడి
బోధఁజేసి, ము
ప్పొద్దులు జోరుగా జవహరుండు ప్రజన్
నడిపించు దారిలో
కొద్ది స్వరాజ్య సౌధమదిగోయని జూపె
అజాదు మోజుగా.

# రా జా జీ

ధాత్రి తన దేగవంటినేత్రాలు మటుకు
పొంచి యింకొకళ్లకి కనిపించనట్లు
నల్లని సులోచనాలు నాణ్యముగఁబెట్టి
పంగనామాలువెట్టెడి వాఁడితండు.

వింతగ చక్రధారి మఱపించు మహాత్ముని
గూడ, యీ గరు
త్మంతుడు మోయుచుండుటకు మంచి
సమర్థుఁడుగాని, మధ్యలో
జంతువులేవియైన పడిచచ్చినవింక
తటస్థ పడ్డచో
ఇంతయు సంశయించక, సహించని
మార్గమువట్టు గోలతోన్.

ఇలువేల్పుల్‌వలె రైతు తంత్రు లదిగో
యీ సర్వ సర్వం సహా
స్థలి నెల్లన్ తమ కూలిబిడ్డల భుజస్కంధాల
పైమోపి, కో
మల కోటీర కళాప్రఫుల్ల సుమ సామ్రాజ్యాభి
షేకమ్ము నీ
సలహాతో ఘటియించుచుండిరయ! ఆచార్యా
స్వతంత్రప్రియా.

పేర్లెటు ప్రేలకుండ నిలపెట్టి, పటేలు
పొటేలుగా జమీం
దార్లకు, షావుకార్లకు, యథార్థముతో
విపరీతమైన ఖం
గార్లనుబెట్టి, మా తెనుఁగుగడ్డకు
కాంగ్రెసు చక్రవర్తి వై
దార్లిక బాగుచేసితివి తాతలనాటిని
రంగనాయకా.

# డా॥ పట్టాభి



కొడుకులందరిలోన జ్యేష్టుడయి పడిన
శ్రేష్టమగు రాజ్య పట్టాభిషేకవేళ
రాముని వనాలకంపిన స్వాములింక
ఉందిరేమొ మా పట్టాభి గుండెజూచి.

ప్రజలలో పెద్ద నోరుగలవానిది రాజ్య
మటంచు ఎంతయో
గిజగిజలాడు గోల పరికించిరిగాని
యనర్గళమ్ముగా
నిజ కవితాప్రవాహము జనించెడి నోరు
మఱెంతయున్న ఈ
ప్రజలిఁక భోగరాజునకు పట్టము కట్టర
దేమి హేతువో.

# విశ్వదాత

బొమికల గూళ్లన్ని పొంగిపొర్లెడి యేటి
　　లోఁబడి యల్లకల్లోలమయ్యె
నగిషీల గిజిగాళ్లు తెగ గాలివానతో
　　గోత. గూలబడి సంక్షోభపెట్టె
బలిసెడి కోడెదూడలు బక్కచిక్కి పె
　　ల్లూబిలో దిగబడి యుసురుగొట్టె
తల్లడిల్లుచు తెన్గుతల్లి మూర్ఛిల్లి యె
　　వ్వాని యోదార్పును గానకుండె.

చల్లని యుదారగంభీరసార ధీర
చారుగుణచాతురీ భుజస్కంధమందు.
విశ్వమును మోపుకొనిన నాగేశ్వరుండ!
విడచితివ మమ్ము దుఃఖపు కడలిలోన.

# ఆంధ్రరత్నం

నీచమత్కారధోరణి లేచునపుడు
కట్టుబడినది బహు నాయకత్వ మింక
నీదు మురళి విన్పించనినేఁడుచూడు
అందఱిఁక నాయకులయిరి ఆంధ్రరత్న.

గొడవల్గోలల కేమిగాని; యిఁక నీ గుంటూరు
గోంగూర ప
చ్చడితో ఈ రవి యస్తమించని మహా సామ్రాట్టు
ప్రాణాలు తో
డెడి వాఁడెవ్వడు? నీకె చెల్లినది; లేఁదే నేఁడు
నీవంటి ద
క్షుడు అధ్యక్షుడు ఆంధ్రరత్నమ! కళా
గోపాల మాణిక్యమా.

హాయిగ నీ యనర్గళ మహా కవితాఝురి
పాయపాయలై
యీ యిలపైన పండుగలకెన్నియొ కాసుల
రాసులై యెటో
పోయెను; రామదాసు వయిపోతివి కానియు
లేక నీవు నీ
ఛాయకు గొప్పగామిగిలె చక్కని పూజలు
ఆంధ్రరత్నమా.

# బెజవాడ గోపాలరెడ్డి

జనులన్ సౌఖ్యమువెట్టు శాసనసభా జంత్రమ్ము
పై తంతు లీ
ఘనమేధానిధులైన మంత్రులె; కమాన్ కాంగ్రెస్సె
ఆ తంతు లం
దు నిరీక్షించిన నిశ్వనంబులలో నిన్నున్
బంచమం బంచు నే
గొనియాడన్ దగినావు శ్రావ్యగతినిన్
గోపాలరెడ్డి ప్రభూ.

# అ. కా శే శ్వ ర రా వు



బ్రిటిషువాఁడు వేసెడి పెద్ద పీటముడులు
విప్పగలవు పీటముడులు వేయగలవు
క్రిప్పుకిటుకుల కీవింక క్లిప్పవైతి
అయ్యదేవరా ! నీతోనె కయ్యమటర?.

శాశ్వతమైన యీ ప్రతిభ సాగెడి
పాశుపతాస్త్రమౌర ! వి
శ్వేశ్వరు డెప్పుడిచ్చెనొ; మహేంద్రుని
పర్వతమెక్కి, యెంత లో
కేశ్వరునైన గెల్చెదవులే ! బెజవాడ
పురమ్ములోన కా
శేశ్వర ! నీవు మంత్రమిడి యెక్కడ
యున్నను తిర్గులేదురా.

# రైతు నాయకుడు



మండువేసంగిలో గుండెలు వడునట్లు
కష్టించు నీ పుష్టి సృష్టిమ్రింగె
జడి వానలోఁబడి తడిసి ముప్పందు మై
పడెడి నీ కొనప్రాణి పుడమితీసె
చలిగాలిలోఁగ్రుళ్ళి పలు ముళ్లలోఁబడు
తొంటి నీ యొడలు బాతులుపెకల్చె
పెండ్లి పండుగలలో వేగెడి నీ భామి
కలు కుక్కలెల్ల నిక్కముగ కొఱికె

ఒక్కచిక్కిన యిల్లాలు దిక్కులేక
బిడ్డలను దీసుకొని యింక బిచ్చమెత్తె
ఏమి దక్కని కష్టమదేల నీకు?
కర్షకోత్తమా లెమ్మోయి ! కయ్యమునకు.

# యుగయుగాల నాయకులు

కృతయుగంబున నా నృకేసరి రానిచో
　　కనక కశిపుబాధ కనులబడదె?
త్రేత సీతారాములే లేకయున్న రా
　　వణ రాజ్యమిపుడు చూపట్టకున్నె
ద్వాపరంబున పంచపాండవుల్లేనిచో
　　కురుపతి చెడుగు లంకురముకావె
కలియుగంబున గాంధి కాంగ్రెస్సులేనిచో
　　భువి నిరంకుశుల ప్రభుత్వబలము

దినదినాభివృద్ధి యగుచు దిక్కులేని
బక్కరైతుల బలిగోరు రక్కసులకు
జయము కలిగి దేశమును ధ్వంసమునుజేయు
చోరవయే యుండెడిదిగాదె భరతమాత.

# భా ర త వీ ర స ము ద్రు డు

ఈ గోలేమిటి? ఈ హడావుడికి మున్నే
హేతువై యుండెనో
వేగంబే చెవివేసి నీ సిగముడిన్ వెన్వెంటనే
వేసుకో
నీ గంభీర పరాక్రమోద్ధతిగతుల్ నీరైనవా
యేమి? వా
ర్ధీ! గుండెల్ సెడి నుగ్ర్గగక్కితివి కీర్తిజ్యోతి
చల్లారెనా?.

వెఱపనుమాట యెట్టిదియొ విన్నది కన్నది
గూడ జన్మలో
నెఱుగని వాఁడవై వెలితి యెన్నఁడులేని
మహాపయోధివై
మెఱసి; త్రిలోక వీర పరమేశ్వర సన్నిధినుండి
యింతలో
మఱచితివేమి పౌరుషముమాట సముద్రుడ
వెట్టివాఁడవై.

# కౌ న రా ని నా య కు డు

మందార మృదు సుధా మధురానులాపయై
త్రైలోక్యవాణి గీతములుపాడ
ఘన వి నీ లాభ్రశకల పంక్తి మధ్య సౌ
దామినీ తన్వి నృత్యమ్ము సేయ
నైపుణిగ విచక్షణా స్వరూపిణియైన
విద్యాకుమారిక వీణమీట
నవరత్న మణిభూషణ విభూషితాంగియై
హిమబిందు సుందరి యొగసిపడగ

వేదమాతలు పెద్ద ముత్తైదులవలె
స్మృతుల మంగళ ప్రదపుటారతులు పట్ట
నీవు కలవారియింటి పెండ్లికొడుకువయి
ఎక్కడుంటివో టక్కరీ ! మ్రొక్కుబడికి.

# జగజ్జనని

కట్టుదిట్టాలచే ఘనశతఘ్నుల కాగు
చుట్టు ప్రాకారాల పట్టు పోయి
సింహపంజాలచేఁ జీల్చి గుండెలుతీయు
పహారాజపానుల బలము తగ్గి
ధనపుసంచులతోడ ధైర్యసాహసమిచ్చు
పెద్ద షరాబులపేరు తఱిగి
నాగేటి పాట్లచేఁ త్యాగ శీలములిచ్చు
రైతురాఃజులు పెద్దగోతిని బడి

కూటి మందరగిరిమోసి గోలనుడుపు
కూలి కూర్మావతారంబు కూలిపోయి
రవ్వల స్వతంత్రభారత రాజ్యలక్ష్మి
కంటి తడియారనిదియయ్యె కడకు నేఁడు.

ఆ యెగబడ్డ సింహనివహంబులపైఁ బసిపట్టి
మారణో
పాయములెల్లఁ బన్నుచుఁ దుపాకులు ప్రేల్చుచు
వల్లకాటిగాఁ
జేయుచు వేటకాండ్రు పరిశీలనజేయుచు
కన్నతల్లి దీ
ర్ఘాయువు తీయబోయిన భయంకర
మేదిని పంకజూడుడీ.

అంతటి ఘోరకృత్యముల కక్కట మృత్యువు
నోటఁ జిక్కె, ది
గ్దంతుల గుండెపెట్లఁ బడుకై వడి ఘోషిలుచున్న
తల్లి ది
క్కెంతయుఁ గాంచకుండ కలహించుట పాడియె
యొండొకళ్లు? మీ
పంతము తల్లి ప్రాణికయి వచ్చినదేమిర?
భారతీయుడా.

అదిగో! చూడుము! పూతఁబట్టి కసుగాయల్ వ్రట్టు
లే మావి గు
న్న దరిన్ గట్టినపైడికోట; వినుడన్నా! దానిలో
నేఁడు తొ
మ్మిది వన్నెల్ రతనాలమేడపయి
లక్ష్మీదేవి సంసార సం
పదతోఁదూగు స్వతంత్ర భారత సతీ ప్రారబ్ద
మెట్లాయెనో.

కొండల గుండె బ్రద్దలయి ఘోరముగా రుధిర
ప్రవాహమై
యుండిన మా జగజ్జనని యుద్ధపు గ్రద్దల
పొట్టఁబూడ్చి, పై
మండిన మండుటెండలకు మాడి, మఱెక్కడ
దిక్కులేక బ్ర
హ్మాండము దద్దరిల్లు ప్రళయంబున బడ్డది
లోకరక్షకా.

ఎముకలు గుట్టలై పడిన ఈ రణభూమికి
చుట్టుపట్ల దే
శములింకలేవు భీకర విషాద సముద్రపు
గోల తప్ప: యు
ద్ధములకు సిద్ధమై తిరిగి దైత్యులు ఏదెస
నుంచి లేచిరో
యమునికిగూడ చచ్చేది మహాపదవచ్చెను
లోకరక్షకా.

# తు పా ను.

ఈ నిరంకుశ శాసన శృంఖలాలు
క్రూర లోకైక తిమిర సంచారమునకు
పయనమై; జగద్బాంధవుండయిన నా ప్ర
భాకరుని స్వర్గనగరికి బదిలిచేసె

ఏమిటి! పిచ్చిపిచ్చిగ మఱిట్టుల నోటికి వచ్చినట్లు, నా రాముని గూర్చి లోకు లవురా చెడుకాకులమాడ్కి కూసి. యేదో మసిబూసి దోచుటకు దుర్గతిలోఁబడద్రోసి పోయినారా! మహి నాప్రభాకరుఁడు రానిదె లేనిదె తెల్లవారునా?

ధీరోదాత్తులు వడ్డపాటులకు ధాత్రీదేవి మేల్కొల్పి. యీ
కారాగారమువంటి లోకమున సౌఖ్యశ్రీ ప్రభాతానికై
గారాబమ్ముగ నాప్రభాకర కళాగంధర్వ గానమ్ముచే
క్షీరాంబోనిధి గ్రామగ్రామమున దూకించెన్ బ్రశంసింపగాన్.

నకలై నావుర : నాప్రభాకర : నటించన్ నీవు; నాగేశ్వరుం
డాకపక్షానికి విశ్వదాతయయి యీ యుర్వీతలంబెల్ల, రం
గకళానందవిభూతిసిన్ నిజభుజస్కంధాలపై మోసి న
ట్లిక. నాచక్కని తెన్గుతల్లి మురళీహేలాతరంగాలలో.

రోజులనెట్టుటెట్లు? పసిగ్రుడ్లనుసాకెడి తల్లికింక నీ
రాజకళానికేతనము రక్కసికొంపగ మారిపోయె; అ
వ్యాజకృపాకటాక్షము ప్రపంచములో ఖరుచయ్యె; తగ్గవీ
భూజననీ భయంకర సముద్రతుపానులు నా ప్రభాకరా.

# నిలువుటద్దం



ఇంత వైశాల్యమైన భవంతిలోన
అందమెగఁబోయు పసిఁడి కుడ్యములమీద
రాజసమ్మొలికించు చిత్రములముందు
నిల్వుటద్దమా! నీకింత నీల్గుడేమి?

నీ మృదుభావమింత రమణీయముగా పులకించి అంతలో
నీమనసెంత తాయియై- నిర్మొగమాటముగా విమర్శ భా
షామణియైనదో కనెడి స్వర్గ సహస్ర కళా ప్రపంచ సు
త్రాముఁడు వచ్చినట్లయిన తద్దయునచ్చువె నిల్వుటద్దమా.

ఏ దర్జాగలవారినో గని, మొగాలెంతో, కళాకాంతిగా
నీదందన్ వెలిగించవచ్చెడి మహానిర్భాగ్య సామ్రాట్టులన్
నీదాక్షిణ్యము టువ్వకుండిన, నిఁకన్ నీజన్మకే కర్మచే
భేదోపాయము పుట్టఁజేతురాగదే విశ్వంభరా దేవతా.

# నా దస్కత్

ఘుమఘుమలాడు పదములేరి కూర్తును
కవనంబు దవనంబు కరణి నేను
కమ్మకమ్మని జీవకళలెంచి చేతును
గానంబు ప్రాణంబుగానె నేను
ఢుమికిదూకెడి ప్రవాహముగూడి నడిపింతు
వాగ్ధాటి రిపుధాటి భంగి నేను
ఫెళఫెళావిఱచు యుక్తులునేర్చి తేల్తును
వాదంబు జూదంబు పగిది నేను.

నాకు రానిదిలేదు, చెలాకిపోదు
డంబమనరాదు, ఇది యబద్ధంబుగాదు
ఎంతవారికినైన వేదాంతకవిని
కొసకు నాళపథంబిది రసికులార.

# హెచ్చరిక



నాలిఖిత పూర్వకమైన అనుమతిలేనిదే, ఎవ్వరూ ఎక్కడా
ఏ వ్యాపారాలకీ ఈ పద్యాలు వాడగూడదు.

వేదాంతకవి
అను వేదాంతం
వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి.

బెజవాడ
26 9—48

# జాతీయ గ్రంథములు



## — కాంగ్రెసు బుర్రకథలు —

| | |
|---|---|
| నేతాజీ జీవితము | 0-6-0 |
| కాంగ్రెసు జెండా | 0-6-0 |
| ధర్మయ్యబాబు | 0-6-0 |
| కాంగ్రెసు విజయము | 0-4-0 |
| కొల్లేటి రైతు | 0-4-0 |
| జమీను రైతు | 0-4-0 |
| ఆంధ్రరాష్ట్రము | 0-4-0 |
| భారత దాస్యం | 0-6-0 |
| హైదరాబాదు రాజ్యాంగ సంస్కరణలు శాసన సభ | 0-8-0 |
| నాటికి నేటికి కథలు సంపుటి | 0-8-0 |
| విద్యార్థుల నిర్మాణ కార్యక్రమం | 0-8-0 |
| నిర్మాణ కార్యక్రమం | 0-8-0 |
| నేటి జపాన్ | 0-12-0 |

